# కరపత్రం నెం. 34

ప్రతులు 2000

తొలి ముద్రణ : 1990



రచన : మల్లాది సుబ్బమ్మ



ప్రచురణ కర్త

స్త్రీ విమోచన శిక్షణా కేంద్రం

మెహిదీపట్నం—హైదరాబాద్

ఫోను : 35429

వెల : రు. 2-00

ప్రతులకు :

స్త్రీ విమోచన శిక్షణా కేంద్రం

వి. ఎం. ఐ. జి. హెచ్ మెహిదీపట్నం

హైదరాబాద్-500 028

ముద్రణ :

సౌజన్య ఆర్ట్ ప్రింటర్స్

గాంధీనగర్, విజయవాడ-3.

# అతివలపై అత్యాచారాలు

# స్వచ్ఛంద సంస్థల ప్రతిఘటనలు

పెళ్ళికాని పిల్ల అరుంధతి. పల్లెటూల్లో పెరిగింది. తండ్రి రత్తయ్య మోతుబరి రైతు. మునగాల గ్రామంలో 10 ఎకరాల మెట్ట తాతలనాటిది దక్కింది. తనూ, తల్లి పూరమ్మ, భార్య సీతమ్మ పొలం దున్నేవారు, నాట్లు వేసేవారు, కోతలు కోసేవారు. అష్టకష్టాలు పడి 15 ఎకరాలకు పెంచారు. నాలుగు బర్రెలల్లా మరో నాలుగు కొని పాలు అమ్మేవాళ్ళు. పొలం గట్లమీద కూరలు పండించి ఎడ్లబండి మీద పట్నం పోయి అమ్ముకొచ్చేవారు. రాత్రింబవళ్లు కష్టపడి రెక్కలార్చుకొని ఇల్లు, పొలం, గొడ్లు ఏర్పరచుకొన్నారు. కాస్తంత ప్రశాంతంగా బ్రతుకుతున్న వారికి రంగడు, గోపిల తర్వాత అరుంధతి పుట్టింది.

మా జీవితాలు ఎలాగూ పల్లెకే అంకితమయినాయి. మా బ్రతుకు అడవిగాచిన వెన్నెల అయింది. విద్యా, విజ్ఞానాలు లేని మోటువాటైన జీవితాలు మావి. పిల్లలకయినా ఇంత చదువులు చెప్పించి వాళ్ళను బాగుచేద్దామని రత్తయ్య, సీతమ్మ నిశ్చయించుకున్నారు. మగపిల్లల్ని గ్రామానికి మూడు కిలోమీటర్ల దూరంలో వున్న స్కూల్లో ఫీజులు కట్టి చేర్పించారు. ఇద్దరూ రోజూ స్కూలుకు పోయివస్తూండేవారు. 7,8 క్లాసుల

చదువుతున్నారు. అప్పటికి అరుంధతికి ఆరేళ్ళు నిండాయి. వీధి బడిలాంటి ఎలిమెంటరీ స్కూల్లో అయిదు క్లాసులు చదివింది. "చాకలి పద్దుకు, పాల లెక్కకు, గింజల కొలతకు ఆ చదువు చాల్లే దాని పెళ్ళి సంగతి కాస్త చూడవయ్యా" అని అంటూ గొణిగేది సూరమ్మ. "ఉండవే అమ్మా, రోజులు మారాయి. నీ మనవరాలు చదివి మా గొప్ప ఉద్యోగం చెయ్యాలి. అప్పుడుగాని దాని పెళ్ళి ఊసెత్తను" అని రెట్టించాడు రత్తయ్య. వంత పలికింది సీతమ్మ.

"అది ఆడపిల్లరా. దాన్ని యాడపెట్టి చదివిస్తావు. మన ఊళ్లో 5 క్లాసులు చదివింది కదా ఇకనయినా చాలించి దాని పెళ్ళి చెయ్యరా?" అని పెద్దగా అరిచింది సూరమ్మ. "ఉండవే నీకెప్పుడూ పెళ్ళి ఊసేనూ, మన రోజులు, మన పరిస్థితులు కూడా ఇపుడు మారాయి. ఎన్నో అద్భుతాలు జరుగుతున్నాయి. పట్నంలో ఆడవాళ్లు చదువుతున్నారు ఉద్యోగాలు చేస్తున్నారు. ఎన్నో నేర్చుకుంటున్నారు. గ్రామాల్లో ఆడవాళ్ళను కూడా చదివి గొప్పోళ్ళను కమ్మని చెప్తున్నారు. రేడియోల్లో, టీవీల్లో అన్నీ యినిపిస్తున్నారు. చూపిస్తున్నారు కదా! మనమ్మాయి మాత్రం ఎందుకు చదవరాదు అని నేను యోచిస్తున్నానమ్మా, అది తెలివిగల పిల్ల చెప్పిన మాట ఇంటది, కష్టపడతాది, కాస్తంత ఎగతోస్తే చాలు ఊరంత

ఎదుగుతాది. నా మాట వినవే అమ్మా! దాన్ని చదివించాలని నాకు ముచ్చటగావుంది, ఇప్పుడే దాని పెళ్ళి ఊసెత్తమాక" అంటూ బ్రతిమాలాడు రత్తయ్య.

"అది సరేగాని దాన్ని యాడపెట్టి సదివిస్తావురా? ఆళ్ళంటే మగాళ్ళు రోజు బడికిపోయి నడిచో, బండిమీదో, సైకిల్ మీదో వస్తున్నారు. ఆడపిల్లను ఎలా పంపుతావురా?" అన్నది సూరమ్మ తన అయిష్టాన్ని తెలుపుతూ. అదా నీ భయం నా చెల్లి సత్తెమ్మ బస్తీలో వుందికదా! దీన్నిపట్టుకెళ్ళి దాని కాడ వుంచి చదివిస్తానే, దానికిన్ని గింజలు గట్రా పంపుతూవుంటా, ఇయాల్టికి అయిదోరోజు ప్రయాణానికిమంచిదని శాస్త్రుల్లుగారు చెప్పారే. ఇయ్యాళ్ళ పోయి రెండు లంగాలు, జాకెట్లు కుట్టిస్తాను. మిగతా సామాన్లు బస్తీలోనే కొని ఇచ్చి దానికి అప్ప జెప్పివస్తా" అన్నాడు రత్తయ్య. అత్తగారింటికి పిల్లను పంపుతున్నట్లు బావురుమన్నారు అత్తా కోడళ్లు, అరుంధతి సంబరపడ్డది.

* * *

"క్రొత్తగా ఈడేరిన దానివి కాస్తంత జాగ్రత్తగా వుండాలి. పైటనిండా కప్పుకొని, తలవొంచుకొని. బడికెళ్ళి రావాలి. తుంటరివాళ్ళు, రౌడీలు, త్రాగుబోతులు వుంటారు.

వాళ్లు నిన్ను ఏమయినా చేస్తే మన పరువు మంటు కలిసి పోతాది. మన్నులేక నాయం కనద అందులో ఆడపిల్లవు పెళ్ళి కావాల్సిన దానివి. మీ అయ్య నిన్ను నాకు ఒప్ప జెప్పి పోయాడు. నేను నిన్ను పువ్వులా వాళ్ల ఇంటికి చేర్చాలి? తెలిసిందా. కొస్తంత చెప్పిన మాట విని నీ పని చూసుకొని చీకటి పడకుండానే ఇంటికిరా. లేకపోతే దారిలో ఏ అఘాయిత్యమన్నా జరుగుతాది. అప్పుడు అందరం కట్ట కట్టుకొని నదిలో దూకాలి. ఇన్నావా అరుంధతీ, నా పరువు, నీ పరువు కాపాడు తల్లీ'' అంటూ వాకిలిదాకా వచ్చి చెప్పటం వినివిని విసుగొచ్చింది అరుంధతికి. అత్తా నా గురించి నీకెందుకంత భయం? నేనే మయిపోతానని నీ బెంగ, నీకాడ కొచ్చి మూడేళ్ళయింది గదా! అపుడు లేనిది ఇప్పుడెందుకు రోజు ఇలా చెప్పి పంపుతున్నావు?'' అన్నది అమాయకంగా అరుంధతి.

''నీకు పొత్తిగా ప్రపంచ జ్ఞానం లేదే తల్లీ! ఆడవాళ్ళ ఎన్ని అత్యాచారాలు, అఘాయిత్యాలు జరుగుతున్నాయో రోజూ పేపర్లలో చదువుతున్నాం, రేడియోల్లో వింటున్నాం, టి విల్లో చూస్తున్నాం మనూళ్ళో రత్తిని మానభంగం చేసి పాడుపడ్డ బావిలో పారేసి పోయ్యారే. నాకప్పటినుండి తుంటరి మగాళ్ళను చూస్తేనే భయం. దూరదూరంగా పోయే

దాన్ని. చదువుకోని బడికి పోని నేను డిగ్రీలు లేని నేను, ఎన్నో విషయాలు సినిమాల ద్వారా తెలుసుకున్నానే. అదంతా సినిమాల గొప్పతనమేనే. అందువల్ల ఆడవారికి విద్యతోపాటు వివేకం, లోకజ్ఞానం కూడా కావాలని నమ్ముతున్నానే, నీవా ఆ పల్లెలో పుట్టి పెరిగావు. నీకు ఏమీ తెలియదు. ఎక్కడ గోతిలో పడతావో ఏ అత్యాచారం జరుగుతుందో అని పదే పదే చెప్తున్నానమ్మా" అంటున్న అత్తతో,

"అత్తా అసలు అత్యాచారాలంటే ఏమిటి? అఘాత్యాలంటే ఏమిటి? అవి ఆడ వాళ్లమీదేనా జరిగేది. ఎవరు చేస్తారు, ఎలా చేస్తారు? ఎందుకు చేస్తారు? అవి ఎన్ని రకాలుగా వుంటాయి?" అని గబగబా అడిగేసింది అరుంధతి. అది విన్న అత్త "అబ్బో! దీనికి క్రొత్త విషయాలు తెలుసుకోవాలనే ఆసక్తి కలగటం గొప్ప విషయమే" అనుకుంటూ సంబరపడ్డది

"వరకట్న మరణం, లైంగికంగా అస్వతంత్రత, ఆర్థికంగా, సాంఘికంగా అణచివేయబడటం, శారీరకంగా, మానసికంగా చిత్రహింసలకు గురిచేయడం, మానభంగాలు లాంటివన్నీ అత్యాచారాలే, అయినా నాకు తెలియనివి ఇంకా ఎన్నో వున్నాయి." అన్నది అత్త సత్తెమ్మ.

"అత్తా అసలు మానభంగాలంటే ఏమిటి? మానభంగాలు ఎన్ని రకాలు, వాటి స్వరూప స్వభావాలు ఏమిటి? వాటి లక్షణాలు ఎలా వుంటాయి? అవి ఆడవారిమీదే ఎందుకు జరుగుతున్నాయి? వాటిని మనం ఎలా అరికట్టగలం? నాకు ఇవన్నీ తెలియ జెప్పవా అత్తా "అంటూ అతి కుతూహలంతో మరో ప్రశ్న వేసింది అరుంధతి. అత్త సత్తెమ్మ దాని ఉత్సాహం చూసి లోపల గర్వపడ్డది కాని తాను కూడా పెద్దగా చదువుకోలేదు. తనకు కొన్ని విషయాలు మాత్రమే తెలుసు. బైటి ప్రపంచం అంత బాగా తెలియదు. అందుకని ఓ సలహా చెప్పింది. రేపటి నుండి మూడు రోజులు జిల్లా మహిళా సంఘంవారు 'స్త్రీలపై అత్యాచారాలు' అనే విషయం పై ఒక సెమినారు పెడుతున్నారు గ్రామ పంచాయితీ హాలులో. అందర్నీ రమ్మనమని కాయితాలు పంచిపెట్టారు. మనిద్దరం వెళ్ళి విందాం. మనకు తెలియనివన్నీ తెలుసు కుందాం. దానివల్ల మనకెంతో ఉపయోగం వుంటుంది. ఉదయాన్నే వంటపని, ఇంటిపని, చూచుకొని పోదాం. అన్ని విషయాలు తెలుస్తాయి" అని సలహా చెప్పిన అత్తమాటలకు ఉబ్బితబ్బిబ్బయి పోయింది అరుంధతి.

* * *

ప్రారంభోపన్యాసం చేసిన నిర్మల, మహిళా సంఘా ధ్యక్షురాలు అత్యాచారాలంటే ఏమిటో, ఎందుకు చేస్తున్నారో

వివరిస్తుంటే సత్తెమ్మ, అరుంధతిలు ప్రక్క ప్రక్కనే కూర్చొని ఏకాగ్రతతో వింటున్నారు.

"రోజు రోజుకు స్త్రీలపై అత్యాచారాలు విపరీతంగా పెరిగిపోతున్నాయి. తెల్లారి లేచి ఏ పత్రిక చూచినా స్త్రీలపై అత్యాచారాలు, వరకట్న మరణాలు, స్త్రీల ఆత్మహత్యలు అనే శీర్షికలతో వార్తలు వస్తున్నాయి. చదువుకున్నవారంతా ముఖ్యంగా మహిళాలోకం ఆందోళన చెందుతున్నారనేది సత్య దూరం కాదు. ఇది దేశానికి, సమాజానికీ అభ్యుదయం కానే కాదు. ఇవి ఎందుకు జరుగుతున్నాయి అని ఆలోచిస్తే ఆడది అంటే బానిస అని, ఆమె పురుషుని కన్నా నాసిరకం అని, కేవలం పురుషుల సంతోషానికి, సౌఖ్యానికి మాత్రమే పుట్టిం దనే భావన అందరిలో ఉండేబట్టే జరుగుతున్నాయి. అంతే కాదు ఆమె అబల కనుక తనను తాను రక్షించుకోలేదు. ఆమె పుట్టుక నుండి వడదాకా మగరక్షణలో బ్రతకాలి. మగ దక్షతలేని ఆడదాన్ని ఎవరైనా అనుభవించవచ్చు అనే దుష్టులు చాలామంది వున్నారు. ఇంకా చెప్పాలంటే ఆమె రెండవతరగతి పౌరురాలు. ఆమె భర్తచేత భరింపబడుతున్నది. కనుకనే భార్య అంటున్నారు. ఆమె అసహాయురాలు పెళ్ళి దాకా తండ్రి రక్షిస్తాడు, పెళ్ళితో ఆ బాధ్యత భర్త నెత్తిన పడుతుంది. ఆ తర్వాత కుమారుడు రక్షించాలి. ఇలా ఆమెను అనుక్షణం ఆదుకునే పురుష వ్యక్తి వుంటూనే వున్నాడు.

అది న్యాయమని, సత్యమని భావించబట్టే ఆమెపై అఘాయిత్యాలు జరుగుతున్నాయి. ముఖ్యకారణం ఆమె అందరికీ లోకువ కనుకనే ఆమెపై అనేక ఆంక్షలు విధించారు. కుటుంబానికి సేవచేస్తూ పిల్లల్ని కని వాటిని పెంచి పెద్ద చెయ్యాలి. విధవరాలయితే బొట్టు, జుట్టు, గాజులుతీసేసి ఇంట్లో వారందరికీ సేవచేస్తూ బ్రతకాలని చెప్పారు. ఎవరైనా మళ్ళీ పెళ్ళాడితే అదేదో పెద్ద నేరమయినట్లుగా చూస్తారు. భర్తలు త్రాగివచ్చి కొట్టినా, తిట్టినా, వెళ్ళగొట్టినా ఆఖరికి చంపినా అది నేరమని పాపమని చెప్పకోరు. ఆమె ఏదో చెడ్డపని చేసి వుంటుంది లేకపోతే అలా ఎందుకు చేస్తాడు. అని ఎదురు ప్రశ్నలేస్తారు. పిల్లలు పుట్టకపోతే మగడు మళ్ళీ పెళ్ళాడటం చాలా ఆవసరమని, మంచిదని మెచ్చుకుంటారు. నేను ఇంక పిల్లల్ని కనలేను అంటే మగబిడ్డ పుట్టిందాకా కనాలని లేకపోతే వంశం అంతరించిపోతుందని, పుణ్యలోకాలు పోయి నరకద్వారాలు దగ్గరవుతాయని చెప్పి ఆమెను ఒప్పిస్తారు.

ముఖ్యంగా చెప్పాలంటే పెళ్ళి జరిగాక అత్తవారింట్లో ఆడది అనుభవించే కష్టాలు, ఆమెపై జరిగే అత్యాచారాలు చెప్పాలంటే వర్ణనాతీతంగా వుంటాయి.

"అసలు అత్యాచారం అంటే ఏమిటి? వాటిని ఎలా తెలుసుకుంటాం. అవి ఎన్ని రకాలున్నాయి. కొట్టడం, తిట్టటం చంపటం కూడా అత్యాచారాలేనాఅండి. వరకట్న

మరణాలు, హత్యలు కూడా అత్యాచారాలేనా? అంటే ఉదాహరణలతో వివరించండి అని అడిగింది ఉపన్యాసకురాలిని మహా కుతూహలంతో అరుంధతి.

ప్రారంభోపన్యాసం ముగిసాక ఈనాటి సెమినారులో నలుగురు మహిళలు లక్ష్మి, శాంత, అరుణ, సౌభాగ్యంగార్లు నాలుగు వర్కు పేపర్లు చదువుతారు.అందులో స్త్రీలపై జరిగే అత్యాచారాల విధానాలు వాటిని ఎలా స్త్రీలపై జరుపుతున్నారు? ఎందుకు జరుపుతున్నారు?వాటి స్వరూప స్వభావాలు ఎలా వుంటాయి? అంటే అవి భార్యలపై దౌర్జన్యం, లైంగిక వేధింపు మానభంగం,అశ్లీలపు నడత విషయాలపై వివరణ జరుగుతుంది. ఎవరి పేపర్లు వాళ్ళు చదివాక మీ మీ ప్రశ్నలు అడగవచ్చు. పేపరుమీద చర్చలు జరపవచ్చు అన్నీ పూర్తి అయిన తర్వాత నివారణోపాయాలు నిర్ణయాలు చేద్దాం అని సెమినారు సమావేశ కర్త లక్ష్మిరాజ్యం సమాధానం చెప్పింది.

మున్ముందుగా లక్ష్మి తన ప్రసంగ వ్యాసం ఇలా మొదలు పెట్టింది. రోజు రోజుకూ ఆడవారిపై అత్యాచారాలు అఘాయిత్యాలూ అనంతంగా జరుగుతున్నాయి. తెల్లారిలేచి ఏ పత్రిక చూసినా, ఏనోట విన్నా వరకట్న మరణాలు,

(2)

హత్యలు, ఆత్మహత్యలు, మానభంగాలు. చిత్రహింసలు లాంటివి ఎన్నో జరుగుతున్నాయి. అసలు ఇంకా బైటికిరాని కేసులుఅత్యధికంగా వుంటున్నాయి. ఆడవారి హత్యలన్నీ ఆత్మహత్యలుగా మారిపోతున్నాయి. ఆడపిల్ల పుట్టాక చంపడం, పుట్టక ముందే (గర్భస్థపిండం ఆడోమగో తెలుసుకుని) గర్భంలోనే విచ్ఛిత్తి చేయటం ఈనాడు మరోకరకపు అత్యాచారంగా అమల్లోకి వచ్చింది. ఇంకా వరకట్నం లాంటివి అన్నిచోట్లా, సతీ సహగమనంలాంటివి అక్కడక్కడ జరుగుతూనే వున్నాయి. వైధవ్యం స్త్రీలపాలిట శాపం అయింది. విధి నిషేధాలనే ఆచారంతో ఆమెపై ఇంటా బయటా జరుగుతున్న అత్యాచారాలు తక్కువేమీకాదు. 1856లో విధవా వివాహ శాసనం వచ్చినా మళ్ళీ పెళ్ళాడిన వారిని తూలనాడటం, నీచంగా చూడటం, కన్యలను పెళ్ళాడి విదేశాలకు అమ్మటం, బలవంతంగా వ్యభిచార వృత్తిలోనికి నెట్టడం, విడాకులు పొందిన స్త్రీని పెళ్ళాడిన భర్త ఆమెను మానసికంగా హింసించడం, అస్తమానం ఆడవారి శీలాన్ని అనుమానించడం.కొట్టడం, తిట్టడం, సిగరెట్లతో కాల్చడం, బూటుకాళ్ళతో తన్నడం, ఎంత చాకిరీ చేసినా ఏదో ఒక నెపంతో ఆమెను శారీరకంగా, మానసికంగా కూడా హింసించడం, లైంగికంగా వేధించడంలాంటివి సవాలక్ష వున్నాయి. ఈ దుశ్చర్యలు ఇలా సాగుతుంటే స్త్రీజాతికి భవిష్యత్తు వుండదు.

అత్యాచారాలు మొత్తంమీద మూడు రకాలుగా, చెప్పుకోవచ్చు. శారీరకంగా హింసించుట మొదటిరకం, మానసిక హింస మరో విధం, ఈ రెండూ కలిపి చేయటం మూడోది. అంటే తిట్టడం మానసికమైతే, కొట్టడం శారీరక హింస అన్నమాట. శారీరక హింస కంటే మానసిక హింస వల్ల మహిళ కృంగిపోతుంది. ధైర్యస్థయిర్యాలను కోల్పో తుంది.తిట్టటం, నిరాదరణ చేయటం, నస పెట్టడం, సూటిపోటి మాటలతో బాధ పెట్టడంలాంటి చర్యలు మానసిక హింసకు తార్కాణాలు. లైంగిక వేధింపు, మానభంగం, సజీవదహనం వీటిలో శారీరక హింస, మానసిక హింస కలగలుపుగా వుంటాయి అన్నమాట. ఇక వరకట్న హత్యలు మరో రక మైన హింసకు తార్కాణాలు.

స్త్రీలపై అత్యాచారాలను సాగించేవారు ఇతరులను బాధించి ఆనందించాలనే దుష్ట మనస్తత్వజాఢ్యా నికి లోనయినవారు, అంటే శాడిష్టులు కావచ్చును లేక స్త్రీ మీద ద్వేషాన్ని పగను పెంచుకున్న పురుషులు కావచ్చును. మూడవరకం వారు మాటలద్వారా చేతలద్వారా పురుషాధి పత్యాన్ని నెలకొల్పాలని ఆశించే వారు. భర్తలచేత రోజూ దెబ్బలు తినటం అలవాటుపడ్డ స్త్రీలు కూడా కద్దు.

సవివరంగా చెప్పాలంటే భార్యలపై దౌర్జన్యం, హింస లైంగిక వేధింపు, మానభంగం, అశ్లీలపు నడతలు, అత్యా

చారపు ముఖ్యలక్షణాలు. కనుక వాటి రూపాంతరాలను వివరించటం తెలుసుకోవడం మన ప్రథమ కర్తవ్యం.

## భార్యలపై హింస

ఇది అన్ని దేశాలలో, జాతులలో, తెగలలో, వర్గాలలో ప్రాంతాలలో అన్ని భాషల వారిలో అన్ని కులాలలో, అన్ని మతాలలో ఈ దుశ్చర్య విపరీతంగా కొనసాగుతున్న దనేది పచ్చినిజం. వయోభేదాన్ని కూడా పరిగణించటం లేదు.

అన్నిటికంటే ముఖ్యమైన దారుణ హింస వరకట్న వేధింపులు, మరణాలు, చిత్రహింసలు. నేడు వరకట్న మరణాలనేవి అత్యాచారాన్నింటిలోకి ప్రధానమైన సమస్యగా పరిణమించాయి. వరకట్నం పుచ్చుకోవటం ఈనాడు ప్రపంచ వ్యాప్తంగా జరుగుతున్న అత్యాచారాలలో మొదటిదిగా పేర్కొనవచ్చు.

కులమత బేధాలు లేకుండా అన్ని వర్గాల వ్యక్తుల లోను ఈ వరకట్న మారణాలు జరుగుతున్నాయి. ఆశ్చర్య కర విషయమేమంటే వరకట్నపు హింసలకు గురిఅయ్యే వారిలో 91 శాతం విద్యావంతులైన స్త్రీలే వున్నారు. ౭0 శాతం సంపాదిస్తున్న స్త్రీలు కూడా ఎదురు తిరిగి పోరాడలేక ఈ దురాచారానికి బలిఅయిన వారిలో వున్నారని లెక్కలొచ్చాయి.

ఇంకా ఇలాగే చెప్పాలంటే ఆడవారిని కొట్టడం సిగరెట్లతో కాల్చడం, బూటు కాళ్ళతో తన్నడం, తప్పత్రాగి నానాతిట్లు తిడుతూ కర్రలతో చావబాదటం, పిల్లల్నిలాక్కొని ఇంటినుండి గెంటివేయటం, నీవు కులటవు అంటు ఆమెను అల్లరిపాలుచేసి చివరి కిపురుగులమందో త్రాగించి చంపటం లాంటి చిత్రహింసలు సవాలక్ష వున్నాయి. అసలు నేను మగాణ్ణి నాకు ఆమెపై సర్వహక్కులూ వున్నాయి అనే అధి కారంతో ఆమెను హింసించటం, చంపటం మనం చూస్తూనే వున్నాం. ఈ హింసలు కాక మరికొన్ని అత్యాచారాలు న్నాయి.అవి మానభంగాలపైరెండో పేపరువ్రాసిన శాంతగారు వివరిస్తారు.

అత్యాచారాలలో అతి ఘోరమయినది మానభంగం. 8 సం॥ల బాలిక నుండి 50 ఏళ్ళ ముసలమ్మ వరకు ఏ స్త్రీ యైనా ఎక్కడైనా, ఎప్పుడయినా ఈ అఘాయిత్యానికి గురి కావడం జరగవచ్చు. అంతేకాదు ఒక స్త్రీని మూకు మ్మడిగా చెరచిన కేసులెన్నో వున్నాయి. కొందరు మాన భంగం చేసి చంపేస్తున్నారు కూడా. ఈ మధ్య ఒక పిల్లను చెరిచి ఆ తర్వాత రెండు కళ్ళూ పొడిచి పారి పొయ్యాడు ఒక దుర్మార్గుడు, ఆమె సాక్ష్యం చెబితే శిక్ష పడుతుందని వాడి భయం.

మన దేశంలో ఈ మానభంగ నేరాలు రోజు రోజుకి విపరీతంగా పెరిగిపోతున్నాయి. ముఖ్యంగా మనప్రాంతంలో

గత నాలుగేళ్ళలో ఈ నేరాల సంఖ్య 1339కి పైగా జరిగి నట్లు ఒక సర్వేలో తేలింది. అంటే రోజుకి ఒకటికి పైగా జరుగుతూనే వుండటం శోచనీయం. ఇంకా బయటికి రాని కేసులు లెక్కకు మిక్కుటంగా వుంటాయి.

ముఖ్యంగా బీద స్త్రీలు, అనాథ స్త్రీలు వీటికి గురి అవుతున్నారు. మైనరు బాలికలపై నేరాలు అధికం అవుతు న్నాయి, నేరస్తుడు బలహీనురాలయిన స్త్రీని, నిస్సహాయు రాలైన స్త్రీని యెంచుకుని తన అత్యాచారానికి బలి చేస్తు న్నాడు. అలాంటి స్త్రీలయితే ఏ విధంగానూ తిరగబడలేరనే ధైర్యంతో ఆ పని చేయటం జరుగుతుంది. ఉదా। నాగమ్మ తల్లిదండ్రులు కూలీ పని చేసుకుని బ్రతికేవారు. నాగమ్మ పుట్టు గుడ్డిది. ఆ రోజు యథా ప్రకారం తల్లిదండ్రులు పని లోకి వెళ్ళారని తెలిసి పొరుగునే వుండే గూండా ఈమెని మానభంగం చేశాడు. ఆమె గుడ్డిది కనుక ఎటూపారిపోలేదు కాబట్టి ఆమె నిస్సహాయతను అసరాగా తీసుకుని ఆమెపై ఈ అత్యాచారం చేశాడు.

ఇంకా పొలాల్లో, చేలగట్లమీద, ఊరిచివర ఆడపిల్ల వంటరిగా కనబడితే చాలు పట్టి బంధించి మానభంగం చేసి పారిపోతారు దుండగులు.

మరో ముఖ్య విషయం. మానభంగం చేసినతుంటరితో రేప్ చేయబడ్డ ఆ పిల్లనిచ్చి పెళ్ళి చేస్తారు. ఇది మరీ ఘోరం

కాదా. మానభంగం చేసిన వాడిమీద పగ ద్వేషం వుంటాయి. అలాంటి వాడిని పెళ్ళాడి వాడితో దాంపత్య జీవితంగడపటం బాధాకరమయిన విషయం. కనుక వాడిని పట్టి తెచ్చి శిక్షించాలే కాని పెళ్ళి చేయటం న్యాయంకాదు. మరొక కేసులో ఒక కుంటి పిల్లను ఇంట్లో ఎవ్వరూ లేని సమయంలో మానభంగం చేసి పారిపోయాడు. వాణ్ని పట్టి బంధించి తెచ్చి నాలుగు నెలలలోగా ఆ బాధితురాలికి ఆరువేలుఇప్పించేటట్లు నోటు రాయించారు. గడువు లోపల అతను ఆడబ్బు ఇవ్వనే లేదు. ఏం చెయ్యాలి? ఆ రౌడీ బాగానే వున్నాడు కాని ఆ కుంటిది అన్ని విధాలా భ్రష్టురాలయింది.

అసలు మానభంగం చేయటానికి కారణాలు ఏమిటో తెలుసుకోవటం మంచిది. కుటుంబాల మధ్యనో, వ్యక్తిగతంగానో, పార్టీల పరంగానో లేక కులమతాల పరంగానో వున్న కక్షల వల్ల వాళ్ళ స్త్రీలను వీళ్ళు, వీళ్ళ స్త్రీలను వాళ్ళు మానభంగం చేసి పగ చల్లార్చుకోవాలనుకోవటం ముఖ్యకారణం. ఒక స్త్రీపై ఒక పురుషుడు మనసుపడి తన కోరిక తీర్చమని ఆమెని అడిగి ఆమె నిరాకరిస్తే ఆ కోపంతో బలవంతంగా ఆమెని మానభంగం చేసి తన కోరికను తీర్చుకోవటంవేరొక కారణం, ఇలాంటివి వ్యక్తిగత కారణాల క్రిందికి వస్తాయి. కొందరు యజమానులు తమవద్ద పనిచేసే స్త్రీలను అధికార బలంతో బెదిరించి మానభంగం చేయటం జరుగుతుంది. ఒంటరిగా ఒక స్త్రీ కనబడితే అప్పటికప్పుడు కలిగిన ఉద్రే

కాన్ని అణచుకోవటానికి పశుబలంతో మానభంగం చేయటం కూడా అప్పుడప్పుడూ జరుగుతూ వుంటుంది. కొందరి విషయంలో వారి కుటుంబాల్లోనే మానభంగాలు జరగటం కూడా వున్నది. ఇలాంటివి జరిగిన సందర్భాలలో పరువు పోతుందనే భయంతో బయటికి రాకుండా దాచి పెడుతూ వుంటారు.

మానభంగాలు ఎక్కువగా గ్రామీణ స్త్రీలపైనే జరుగుతున్నాయంటే కారణం వారికి సరియైన లోక జ్ఞానం లేక పోవటం వల్లనే అని చెప్పవలసి వస్తుంది.

మానభంగం పెద్ద నేరం క్రింద రాదని అందువల్ల బయటికి చెప్పి అల్లరి చేసుకోవటం ఎందుకని కొందరి అభిప్రాయం, కానీ అది తప్పుడు అభిప్రాయం. ఈ కేసులకు రకరకాల శిక్షలు వున్నాయి. కనుక అవిమనం తెలుసుకుంటే నేరస్తులను పట్టి రుజువు చేసి శిక్షలు వేయించవచ్చు.

చట్ట ప్రకారం, మానభంగం చేసిన నేరస్తునికి ఆ కేసు యొక్క పరిస్థితిని బట్టి కనీసం 7 సం!రాల నుంచి జీవిత ఖైదు వరకు శిక్షలు అమలు జరపొచ్చు. తమకస్టడీలో వున్న స్త్రీపై జైలు సూపరింటెండెంటు కాని, హాస్పటల్ సూపరింటెండెంటు కాని, హాస్టల్ సూపరింటెండెంటు గానీ, ప్రభుత్వం ఉద్యోగిగాని మానభంగం చేసినప్పుడు, కోర్టు ద్వారా విడిగా వున్న భార్యపై భర్త మానభంగం చేసినప్పుడు ఆ వ్యక్తికి పది సంవత్సరాలు శిక్ష వేయవచ్చు.

## వరకట్న మరణాలు

ఈనాడు వరకట్న మరణాలు అత్యాచారాలలో ప్రధానమైన సమస్యగా పరిణమించాయి. కుల మత బేధాలు లేకుండా అన్ని వర్గాల వ్యక్తులలోను ఈ వరకట్నపు హింసలకు, హత్యలకు గురి అవుతున్న మహిళలు అత్యధికంగా వున్నారు. ఇందులో 9శాతం విద్యావంతులయితే (20 శాతం) సంపాదించే వారిలో కూడా వున్నారు. వరకట్నం ఈనాడొక పెట్టుబడిలేని వ్యాపార లక్షణమైంది. వస్తువులపై మోజువల్ల ఆ దురాచారం ఇంకా పెరుగుతోంది, 1961లో వరకట్న నిషేధశాసనం వచ్చింది. 1984లో, 86లలో అనేక సవరణలువచ్చి శిక్షలు, జుల్మానాలు పెంచారు. ముద్దాయికి 7సం॥ నుండి జీవితఖైదు వరకు శిక్ష వుంది, కొన్ని సమయాలలో ఉరిశిక్ష కూడా వేయవచ్చు అన్నది సుప్రీం కోర్టు. అయినా వరకట్నపు హత్యలు, ఆత్మహత్యలు దిన దినాభివృద్ధి చెందుతున్నాయి.

గ్రామీణ స్త్రీలు కూడా తలకు మించిన కట్నకానుకలు సమర్పించి ఆడంబరాలతో పెళ్ళి జరిపి అప్పులపాలయిపోతున్నారు. ఎలాగయినా ఆడపిల్లను అత్తవారింటికి పంపాలనే తపనతో తలకుమించిన కట్నకానుకలు చెల్లిస్తారు. కానీ అది అక్కడితో ఆగదు. పెళ్ళయిన తర్వాత కొత్త అల్లుడి సరదాలు తీర్చడానికి అడపా దడపా డబ్బు రూపంగానో, వస్తు

(3)

రూపంగానో ఏవో ముట్టచెప్పుతుంటారు. అది రాను రాను అల వాటుగా మారి ఎన్నితెచ్చినా ఇంకా ఏవో తెమ్మని అల్లుడు, అతని తరపువాళ్ళు వేధించటం మొదలుపెడతారు. ఒకసారి నరమాంసాన్ని రుచి చూచిన పులి మళ్ళీ మళ్ళీ నరమాంసానికే పొంచి వుంటుంది కదా! అలాగే ఆమె తల్లిదండ్రుల వద్దనుంచి తనకు కావలసిన సొమ్ము తెమ్మని పంపడం, తేలేక పోతే ఆమెని రకరకాలుగా హింసించి చంపడమో లేక ఆమే ఆత్మహత్య చేసుకునేటట్లు చేయడమో జరుగుతున్నది. ఉదా :— లక్ష్మికి ఏభయి వేలు కట్నం ఇచ్చి పెళ్ళి చేశారు. మరొకరు లక్ష కట్నం ఇస్తారని తెలిసి ఆశ చావక ఈమెని కిరసనాయిలు పోసి కాల్చి చంపి అది ఆత్మహత్యగా చిత్రీకరించారు. నిందితుడు తప్పించుకున్నాడు. దీనికి కారణం ప్రత్యక్షంగా చూసిన సాక్షులే సాక్ష్యం చెప్పటంలేదు. సాక్ష్యం దొరికితే నేరస్తునికి మరణశిక్ష పడుతుంది. ఒకటి రెండు కేసులు రుజువయి శిక్ష పడితే అది చూసి భయపడి మరొకరు ఇలాంటి నేరాలు చేయకుండా వుంటారు.

కట్నం ఇవ్వటానికి ప్రథమ కారకులు తల్లిదండ్రులేనని మనందరికీ తెలుసు. అమ్మాయి జీవితం సుఖవంతమవుతుందని కొందరు, సమాజంలో మెప్పుకోసం మరికొందరు, తమ హోదాకి గుర్తుగా లేక ఆస్తిలో భాగంగా భావించి కొందరు ఇస్తుంటారు. ఇంకా గొప్ప సంబంధాలకు ఎగబడటం లాంటివి ఎన్నో కారణాలున్నాయి.

అలాగే వరకట్న మరణాలకి బాధ్యులెవరంటే భర్త ఎంతటి క్రూరుడయినా వదలిపెట్టి రావద్దని అమ్మాయిని తిరిగి పంపటం వల్ల, విడాకులు పొందిన స్త్రీకి సంఘములో గౌరవం లేదని ఎలాగోలా అతనితోనే బ్రతకమనడం వలన, అమ్మాయి తిరిగి వస్తే తమ మిగిలిన సంతానానికి పెళ్ళికాదని కుటుంబ ప్రతిష్ట దెబ్బ తింటుందనీ తల్లిదండ్రులు ఆమెకి నచ్చచెప్పి పంపటం కారణంగా జరుగుతున్నాయని చెప్ప వచ్చు. ఇకపోతే అమ్మాయిలకు కూడా ఆత్మస్థయిర్యం లేక పిరికితనంతో చావడం లేదా చంపబడటం జరుగుచున్నది. మహిళా సంఘాల్లో కాని, మహిళల్లోకాని ఐక్యత లేకపోవటం మరో ముఖ్య కారణం. నిందితునికి 15 వేల జరిమానా ఐదు సంవత్సరముల జైలు శిక్ష వున్నా కేసులు రుజువుకావటం లేదు. కనుక కొన్ని ముఖ్యమైన లక్ష్యాలను మనం సాధిస్తే ఆనాడే ఈ దురన్యాయం పటాపంచలయిపోతుంది.

వరకట్నం కోరే వరుడ్ని స్త్రీలు వివాహ మాడరాదు. కట్నం, కులం మతం వీటిని అధిగమించి ప్రేమ వివాహాలను ప్రోత్సహించాలి. అత్త కూతురును కోడలిని సమదృష్టితో చూడగలగాలి. అమ్మాయిలకు వృత్తి విద్యలు నేర్పించి వారిని స్వశక్తిమీద నిలబడేలా చేయగలగాలి. తల్లి కూతురితోబాటు కొడుకుని కష్టపడి పనిచేయించాలి. ఇద్దరినీ తేడాతో చూడ రాదు. ఇంకా వరకట్న శాసనాన్ని పటిష్టం చేసి కట్నం

ఇచ్చినా, పుచ్చుకున్నా నేరస్తుడుగా చూపాలి. యువజన సంఘాలు కట్నం పుచ్చుకోమని, విద్యార్థినులు కట్నం ఇచ్చి పెళ్లాడమని ప్రతిజ్ఞలు చేయాలి, భార్యను చంపిన వాడిని వెలి వేయాలి. వాడికి మళ్ళీ పిల్లనిచ్చే ప్రసక్తి వుండరాదు.

భార్యలను కొట్టటం అత్యాచారాలలో ఒక విధమైన చిత్రహింస. గ్రామస్థులలో ముఖ్యంగా పేదవారిలో దాదాపు 90శాతం ఆడవారిని భర్తలు త్రాగివచ్చి కొట్టటం, వారు సంపాదించే సొమ్మును లాక్కొని జల్సాలు చేయడం చేస్తు న్నారు. ఈ దుశ్చర్య అన్ని దేశాలలో అన్ని జాతులలో, తెగలలో, వర్గాలలో, ప్రాంతాలలో కులాలు, మతాలు, భాష లలో సర్వే సర్వత్రా జరుగుతున్నది. దీనికి వయసుతో పని లేదు. ఇది మహాదారుణం. ప్రతిరోజూ దెబ్బలుతిని అలవ టించే స్త్రీలు అధికంగా వున్నారు. పైగా గ్రామాల్లో ఒక ప్రచారం వుంది. "ఆడది దెబ్బలు తినడం తప్పా, మగాడు కొట్టడా" అని అదేదో జాతీయ ఆచారంగా అభివర్ణిస్తారు. అది నిజమేనని నమ్మి దెబ్బలు తింటున్నారు. మన ఆడ వారు. అలాంటి హింసకు లోనయిన ఆడవారిని ఆదుకోవ టానికి కొన్ని సూచనలు చేయటం అత్యవసరం.

ప్రతి ప్రాంతంలోను శరణాలయాలను, రక్షణాలయా లను నెలకొల్పటం. ఆడవారికి వారి హక్కులను గురించి తెలియజెప్పటం. బాధితులకు రక్షణ ఇవ్వటానికి మహిళా

సంఘాలు, మహిళోద్యమకార్యకర్తలు, సంస్కారులు ముందు కొచ్చి వారిని ఓదార్చి ఒక దరిచేర్చటం తమ విద్యుక్త ధర్మంగా భావించాలి.

అత్యాచారాల పాల్పడిన స్త్రీల కొరకు ప్రత్యేకంగా పట్టణాల్లో కుటుంబ న్యాయస్థానాలు ఏర్పడ్డాయి. బాధితు లయిన స్త్రీలు ఆ కోర్టులకు వెళ్ళి అర్జీలు పెట్టుకోవాలి. కొన్ని సందర్భాలలో మాత్రమే కేసులు ఫైలులోకి తీసుకుంటారు. ఏ స్త్రీకి ఘాత జరిగిందో ఆమె తల్లి దండ్రులు, మేనమామ, సోదరి, సోదరుడు మాత్రమే ఫిర్యాదు చేయవచ్చు. ఇటీవల 489 సెక్షను ఎ క్రింద అనేక కేసులు నమోదు అవుతు న్నట్లు తెలుస్తున్నది. ఏది ఏమయినా మనం శ్రద్ధ తీసుకొని ముద్దాయిలకు శిక్ష పడేటట్లు చేయించటం మన కనీస బాధ్య తగా చూచుకోవాలి.

అత్యాచారాల్లో ఒక లక్షణం లైంగిక వేధింపు అంటే స్త్రీలపట్ల అసభ్యంగా ప్రవర్తించటం. ఈ వేధింపు అనేక పద్ధతుల్లో సాగుతోంది. పురుషుడు స్త్రీ శరీరాన్ని తాకుతూ పోవటం, ఆమె కొంగు లాగటం, కన్నుగొట్టటం, సైగచేయడం ఈలవేయుటం, బూతు పాటలు పాడటం, అశ్లీల భాష మాట్లా డటం, ఆమె లైంగిక సాహచర్యాన్ని ఆశించటం లాంటివి చేసి వారిని అవమానపరుస్తున్నారు. తుంటరులను తప్పించు కోలేక, పైకి చెప్పలేక కొందరు ఆత్మహత్యల పాలపుతు

న్నారు. మరి కొందరు చదువులు మానేసి ఇంట్లో కూర్చుంటున్నారు. పైచేష్టలు చేసిన దుండగులకు చట్టప్రకారం శిక్షలున్నాయి.

ఫ్యాక్టరీలలో, ఇళ్ళ కట్టుబడి ప్రదేశాలలో పనిచేస్తున్న మహిళలున్నారు. వారిని గేటు కాపలాదార్లు, సూపర్ వైజర్లు, మేస్త్రీలు వేధిస్తుంటారు. రక్షించేవారు లేక సహాయం వచ్చేవారు లేక కొంతమంది స్త్రీలు లొంగిపోతున్నారు; మరికొంత మంది జీవనోపాధి పోగొట్టుకొని అలమటిస్తున్నారు. కార్మిక సంఘాల నాయకత్వం కేవలం పురుషాధిపత్యంలో వుండటంవల్ల ఈ విషయాలపై వారు శ్రద్ధ చూపడం లేదు.

అలాగే అనేక కార్యాలయాల్లో అధికార్లు మేనేజిమెంట్ పని వారిపై స్త్రీల పొందుకోసం వత్తిడి చేయడం తరచుగా వింటున్నాం. ఇది ప్రపంచం మొత్తం మీద జరుగుతున్న అత్యాచారం. కొన్నిసార్లు సైగచేసి కోరడం జరుగుతుంటే మరికొన్నిసార్లు సూటిగా అడుగుతున్నారు. స్త్రీలు పనిచేస్తున్న కర్మాగారాల్లో తోటి మగ పనివారి ప్రవర్తన అసభ్యంగా మహాదారుణంగా వుంటున్నది. వారు ఆడపనివారిని హేళన చేయటం, రహస్యంగా అపనిందల పాలు చేయటం చూస్తున్నాం. కొత్తసుఖంగా బట్టలేసుకున్న స్త్రీని దుర్విమర్శలు చేస్తుంటారు. ఇక పెళ్ళికాని పిల్లయినా వితంతువు అయినా, భర్తనుండి విడిపడి బ్రతుకుతున్న ఆమెఅయినా అలాంటి వారిపై యజమానుల దుశ్చర్యలు పెరిగిపోతున్నాయి.

లైంగిక వేధింపుకు కొన్ని శిక్షలు కూడా వున్నాయి. స్త్రీ యొక్క గౌరవ మర్యాదలకు భంగకరంగా ఆమెపై దౌర్జన్యంగా ప్రవర్తిస్తే సెక్షను 354 భారత శిక్షాస్మృతి క్రింద 2 సం॥రాలు శిక్ష వుంది అలాగే మాటలతో చేతలతో ఆమె గౌరవ మర్యాదలకు భంగం వాటిల్లితే సెక్షను 509 క్రింద 1 సం॥ జైలు శిక్ష, జరిమానా విధించవచ్చు. అడపా దప్పుడు విద్యార్థులను, మరి కొందరు రౌడీలను అరెస్టుచేసి శిక్షలు వేయటం పత్రికలలో చదువుతున్నాం. శిక్ష మాత్రం చాలా స్వల్పంగా వుండటంతో వాటి విషయమై వ్యతిరేక ప్రచారం లేనందువల్ల నేరాలు తగ్గకపోగా పెరుగుతున్నాయి. ఏది ఏమయినా సమాజపునడక, తీరు మారనంతకాలం స్త్రీల రక్షణకు, భద్రతకు గ్యారంటీ లేదు కనుక ప్రజలు పోలీసులు, ప్రభుత్వం, యువతీ యువకులు కలసి పోరాడితే తప్ప స్త్రీలపై జరిగే ఈ లైంగిక వేధింపు సమసిపోదనేది నగ్నసత్యం.

ఆడపిల్ల పుట్టాక చంపేవారు కొందరైతే పుట్టకముందే గర్భంలోనే విచ్ఛిత్తి చేయడం మరో రకపు అత్యాచారం నేడు అమల్లోకి వచ్చింది. గర్భస్థ శిశువు ఆడో మగో తెలుసుకునే పరీక్షలు ఈనాడు పట్టణాల్లో జరగడం వల్ల 78 వేల ఆడపిండాలు హతమార్చబడ్డట్లు వార్తలొచ్చాయి. ఆడపిల్లలపై జరిగే అమానుష అనాగరిక లక్షణం ఇది. 1970లో

ఆడ శిశువుల హత్య నిషేధించినా ఇదొక సామూహిక మారణహోమం అనక తప్పదు. దీనిని హింసగానే కాదు హత్యలని చెప్పాలి. ఆడపిల్ల తక్కువ అనే భావానికి ఇదొక నిదర్శనం

సతీ సహగమనం అత్యాచారం చాలా అరుదు అయినా ఇంకా అక్కడక్కడా జరుగుతూనే వుంది ఇటీవల దేవరాలలో జరిగిన సహగమనమే దీనికి నిదర్శనం. 1829 లో సహగమన నిషేధం వచ్చినా ఇంకా ఇది పోలేదని పై సంఘటన ద్వారా తెలుస్తుంది. అంతేకాక సతిని ప్రోత్స హించే మఠాధి పతులు, పీఠాధిపతులు, ఖండించని పెద్దలు వున్నారంటే మనమింకా రాతియుగంలోనే జీవిస్తున్నామన్న మాట.

అలాగే వైధవ్యం స్త్రీల పాలిట శాపమయింది. భర్త పోయిన భార్య పనికి మాలినవస్తువు క్రిందలెక్క. 1856లో విధవా వివాహ శాసనం వచ్చినా ఈనాటికి ఇంకా అమల్లో లేకపోగా మళ్ళీ పెళ్లి చేసుకున్న వారిని తూలనాడటం, నీచంగా చూడటం ఇంకా జరుగుతూనే వుంది. కనుక చట్టాల కంటే సంఘ బలం, ప్రజా మోదం చాలా అవసరం అని చెప్పక తప్పదు.

అసలు అత్యాచారాలు ఎందుకు జరుగుతున్నాయి? ఎవరిమీద జరుగుతున్నాయి? ఎవరు చేస్తున్నారు? అనేవి కొన్ని ప్రశ్నలయితే, అత్యాచారాలను ఎవరు అరికట్టాలి?

ఎలా ఆపగలగాలి? ఎందుకు ఆరికట్టాలి? అనేవి మరికొన్ని ప్రశ్నలు మన ముందున్నాయి.

అత్యాచారాలు ఎవరివల్ల జరుగుతున్నాయి?ఈ చర్యల వలన వారికి లాభమేమిటి? వీటికి మౌలికమైన కారణాలేమిటో తెల్సుకుంటే ఆ ప్రశ్నల్లోనుండే సమాధానాలుదొరుకుతాయి. అసలు ఎంతటి క్లిష్ట సమస్య అయినా తర్కబద్ధంగా విడదీసి చూస్తే, మేధాశక్తితో ఆలోచిస్తే ఆ సమస్య మూలకారణ మేమిటో తెలుస్తుంది. అయితే మరి ఈ చిక్కులను విడదీయ గల తాత్వికులెవరు? దానికి మార్గదర్శకులెవరూ? ఎంత వరకు అణచగలుగుతారు అని మరికొన్ని ప్రశ్నలు ఉద్భ విల్లుతాయి.

ఏ సమస్య చక్కబరచాలన్నా ఏ చిక్కు విడదీయా లన్నా ఆ సమస్యవల్ల బాధపడుతున్న బాధితులు ముందుకు రావాలి. అసలు సమస్యను వారు అర్థంచేసుకోవాలి. దానివల్ల తమజీవితాలు ఎలా తల్లడిల్లిపోతున్నాయో అవగతం చేసుకో వాలి. తాము సంకెళ్ళలో వున్నామని గ్రహించినవారు వాటి విముక్తికై పోరాడగలరు. అంతేగాని ఎవరోవచ్చి ఎవరి కోసమో పోరాడతారని ఎదురుచూడటం అర్థరహితం. కనుక బాధితులైన స్త్రీలు పోరాట రంగంలో ముందు భాగాన నిల బడితే వారికి స్వచ్ఛంద సంస్థలు చేయూతనిచ్చి తోడ్పడతా రనేది తథ్యం. అశ్లీల సాహిత్యం, సినిమాలు, వ్యాపార ప్రక

(4)

నలు, అంగాంగ ప్రదర్శనలు, మోడలింగు (స్త్రీని కూర్చో పెట్టి చిత్రాలు గీయటం), శృంగార నాట్యాలు, బూతుపాటలు ఇలాంటివన్నీ స్త్రీని మానసికంగా న్యూనతపరిచే అత్యాచారాల క్రిందికి వస్తాయి. వీటికి చట్టాల ద్వారా శిక్షలు వున్నా అవన్నీ రుజువు కాకనో, ప్రజా వ్యతిరేకం లేకనో అణగారిపోతున్నాయి. ఉ॥ బలాత్కారం తో మానభంగం జరుగుతుండగా చూచిన వ్యక్తి సాక్ష్యం చెప్పాలంటే అది జరిగేపనికాదు. అందువల్లే 'రేపు' కేసులు వీగిపోతున్నాయి. అలాగే వరకట్న హత్య కూడా అమ్మాయిని తగలేస్తుండగా సాక్ష్యం చెప్పాలంటే మనం చూస్తుండగా కాలుస్తారా? లేకలు విని చెప్పినా ఆమే కాల్చుకుని అరిచిందని కేసు కొట్టేస్తారు. భర్త కొట్టటం, తిట్టటం కూడా అందరి ముందూ జరగదు కదా! అలా ఎన్నో మరెన్నో తగిన సాక్ష్యాధారాలు లేక అసలు కోర్టుకెళ్ళరు. కోర్టుకెళ్ళినా కేసులు ఓడిపోతున్నారు. దీనికంతకూ కారణం ఆడవారి అజ్ఞానం, అసమానత్వాలు, పురుషదురహంకారాలేననేది నిజం. అంటూ ముగించింది చివరి పేపరు చదివిన సౌభాగ్యలక్ష్మి.

''స్త్రీలపై అత్యాచారాలు, అఘాయిత్యాలు చాలా వరకు తెలియజెప్పారు. ఎన్నో విషయాలు తెలిశాయి. కాని వాటిని ఎలా ఎదుర్కోవాలి? ఎలా రూపుమాపాలి? దానికి పరిష్కార మార్గాలేమిటి? అనే విషయాలు కూడా తెలియ

జేస్తే కాస్తంత స్థిమితంగా వెళ్ళిపోతామండి" అంటూ మరో శ్రోతభార్గవి ప్రశ్నించింది సెమినార్ నిర్వాహకులను.

ముగింపు సమావేశానికి ముఖ్య అతిథిగా విచ్చేసిన రిటైర్డు ప్రిన్సిపాల్ తన అనుభవాన్నంతా రంగరించిపోసి, పూర్వాపరాలన్ని సమన్వయ పరచికొన్ని నివారణోపాయా లిను నిర్దేశించింది.

తనమీద జరుగుతున్న శారీరక హింసను, మానసిక హింసను, మానభంగ నేరాన్ని, లైంగిక దుశ్చర్యలను, ఇతర అవమానాలను నేటి ఆధునిక మహిళ వ్యతిరేకిస్తున్నది. ఈ రకమైన మానభంగాలను వరకట్న హత్యలను, లైంగిక దోపిడీని, హింసలను ఆమె తీవ్రంగా ప్రతిఘటిస్తోంది. పరిస్థితులు మార్పుచెందుతున్న నేటి సమాజంలో మహిళల స్థితి కూడా మారాలి. మారకపోతే బాధితులు ఎదుర్కొనే పరిస్థితి వస్తుంది. అప్పుడు వారిని అదుపులో పెట్టటం దుస్సాధ్యమవుతుంది. కనుక సామాజిక పరిస్థితులతో పాటు మహిళల హోదా, వారి జీవన పరిస్థితి మారాలి. ఒకప్పుడు అణగారిన ఆమె ఈనాడు స్వేచ్ఛా సమానత్వాలు కోరుతోంది. అది కొంతవరకు అసాధ్యమయినా దుస్సాధ్యం మాత్రం కాదు. అది ఆమె ప్రస్తుత కర్తవ్యమే కాదున్యాయం కూడాను. అందువల్ల ఆడవారిపై జరుగుతున్నఅత్యాచారాలు అరికట్టాలి. సాంఘిక, ఆర్థిక, సాంస్కృతిక రాజకీయరంగాల్లో

అణగారి పోయిన వారిని సమానమైన వ్యక్తులుగా సముద్ధ రించాలి. అలా పరిగణించాలంటే ఈనాడు అనుభవిస్తున్న అరాజక వ్యవస్థ నుండి వారిని ఉద్ధరించాలి. అందుకు అను వగు మార్గాన్వేషణను అన్వేషించాలి. దానిని ఎలా సాధించా లంటే పురుష ద్వేషం వల్ల అత్యాచారాలు సమసిపోవు. పురుషాహంకారాన్ని వ్యతిరేకించటం వల్ల మాత్రమే సమ సమాజ ఆవిర్భావం జరుగుతుంది, పురుషాధిపత్య భావనా విసర్జనవల్ల అత్యాచారాలు నశించిపోతాయి. సమానత్వ భావనా వ్యాప్తి కలిగినప్పుడు మాత్రమే అవి పోతాయి. ఈ కృషికి పూనుకోవలసింది ముఖ్యంగా స్త్రీలు. స్త్రీ స్వేచ్ఛా సమానత్వాలపై విశ్వాసమున్న పురుషులు కూడాఅగ్రభాగాన వుండవలసిన వారే. ముఖ్యంగా విద్యార్థిలోకం స్త్రీలపై అత్యా చార విధ్వంసనకు పూనుకోవాలి. వివేకం, విజ్ఞానం, ధైర్యం, సాహసం త్యాగం స్వార్థ రహితం లాంటి లక్షణాలు స్త్రీలలో పూర్తిగా పెరిగినవాడు ముఖ్యంగా నిర్భయత్వం వారికి అండగా నిలచిననాడు వారిని వారే ఉద్ధరించుకోగలరు. అనాడే ఆడవారిపై జరుగుతున్న అత్యాచారాలు పటాపంచ. లయిపోతాయి.

అంతేకాదు ప్రతిఫలాపేక్షరహితంగాచేసేసేవేస్వచ్ఛంద సేవ. స్వచ్ఛంద సేవకులకు కరుణ, జాలి,దయ, సానుభూతి నీతి నిజాయితి, ఆత్మ స్థయిర్యం ముందుగా అలవడాలి,

దూషణ భూషణాలకు క్రుంగుట, పొంగుట నిషేధింపబడాలి, ముఖ్యంగా వారిలో చిత్తశుద్ధి వుండాలి. ఈ సహాయం మీకు చేశామనే గర్వం, దర్పం అసలే పనికి రావు. వారిని తాను ఉద్ధరించానని విర్రవీగరాదు. వారికి వారే నిలబడేటట్లు చూడాలి గాని ఈ సహాయం నావల్ల జరిగిందని ఏనాడూ చెప్పుకోవడం పనికి రాదు. తమ బిడ్డలకి ఎలాంటి సలహా ఇస్తారో బాధితులకు సయితం అలాంటి సహాయసహకారాలనే అందివ్వాలి. కేవలం పేరు ప్రతిష్ఠలకాశించి చేసే సేవా కార్యక్రమాలకు శాశ్వతత్వం వుండదు. మనం చేసే పనిని బట్టి గౌరవ మర్యాదలొస్తాయికాని వాటికోసం అర్రులు చాస్తే అవి యండమావులయిపోతాయి. ఈ లక్షణాలు గల అర్హులు సునిశిత బుద్ధితో, పక్షపాత విముఖతతో కార్యరంగంలోకి దిగి స్వచ్ఛంద సేవకొక గౌరవం, హోదా తెచ్చి పెట్టాలిగాని అభానుపాలు చేయరాదు. కేవలం డబ్బుకోసం చేసే పని మాత్రం వాలంటరీ సర్వీసు అని చెప్పుకోవటంహాస్యాస్పదం.

స్త్రీ కావచ్చు, పురుషుడు కావచ్చు మేధావు లెప్పుడూసామాజిక రుగ్మతలను సంస్కరించడమే వారి లక్ష్యంగా పెట్టుకుంటారు, మధ్యలో ఎన్ని కష్టాలు వచ్చినా, ఎవరు అడ్డగించినా కర్తవ్యాన్ని విడనాడరు.

అసలు సేవచెయ్యాలని ముందుకొచ్చినా ఎలా చెయ్యాలి? ఎవరికి చెయ్యాలి అనేదానికి మరికొంత మేధస్సు

వాడాలి. కేసుకేసుకు వైవిధ్యం వుంటుంది. సమస్య సమస్యకీ తేడాలుంటాయి. గనుక సమయ స్ఫూర్తి, ముందు చూపు, ప్రస్తుత కర్తవ్యం ఆలోచించి కార్యరంగంలోకి దూకాలి. బాధిత పీడిత స్త్రీల హృదయాలలోకి చొరబడాలే కాని తాను ఒక దివ్యస్వరూపనని, మహోదాత్తసంపన్నురాలినని కలలో కూడా తలంచరాదు.

నాటి అత్యాచారాలు వేరు నేటి లక్షణాలు వేరు. బాల్య వివాహాలు, బహు భార్యత్వం, వేశ్యావృత్తి, కన్యాశుల్కం, విధవా వివాహం, విద్యా ఉద్యోగావకాశాలలేమి లాంటివి చాలా వరకు తగ్గిపోయాయి. ఇప్పుడు వరకట్న హత్యలు, మానభంగాలు, ఆత్మహత్యలు స్త్రీ పురుషుల తేడాలు, భర్తల హింసలు ముఖ్యమైనాయి. కనుక ఆయారంగాలలో చొరబడి సహాయ కార్యక్రమాలు నిర్వహించాలి.

అత్యాచారాలు జరిపేవారికి హృదయాలుండవు. ఆత్మాభిమానం వుండదు. దయాదాక్షిణ్యాలు అసలేవుండవు. స్పందన, సానుభూతి వారిలో ఏ కోశానా వుండవు. వారు నరరూప రాక్షసులు. పయోముఖ విషకుంభాలు. సప్త జన్మ లెత్తినా మనం వారిని మార్చలేము. అందువల్ల వారివల్ల బాధ పడే బాధితులకు మనం ఆశ్రయంఇవ్వగలగాలి. చావకుండా ఆ రాక్షసుల బారినుంచి తప్పించగలగాలి. మోసపోయిన వారికి మనోనిబ్బరం ఇచ్చి మళ్ళీ పెళ్ళిచేసి వాళ్ళ కాపురాలు

నిలబెట్టాలి. అక్రమ సంతానం కలిగితే వారిని సమాజానికి దూరం చెయ్యకుండా అందరితో కలిసి మెలసి తిరిగేలా చెయ్యాలి. కన్యతల్లి అయితే ఆమెను నిందించడం, తిరస్క-రించడం చేస్తే వాళ్ళను దుయ్యబట్టాలి.

వరకట్న రాకాసిని ఎలా హతమార్చాలి? అనేదొక శేషప్రశ్న. మెప్పుకోసమని, హోదా కోసమని కట్నం ఇవ్వటానికి ప్రథమ కారకులు తల్లిదండ్రులు. అలాగే వరకట్న మరణాలకు బాధ్యులెవరంటే కుటుంబ ప్రతిష్ఠకోసం భర్త ఎంత క్రూరుడయినా తిరిగి రావద్దని చెప్పి పంపుతారు. ఆ తర్వాత పిల్ల శవాన్ని తెచ్చుకుని విలపిస్తారు.

వరకట్నం కోరే వరుణ్ని మన అమ్మాయిలు వివాహమాడరాదని చిన్ననాటి నుండి అమ్మాయిలకు పాఠాలు చెప్పాలి. కట్నం పుచ్చుకున్నవారిని హింసలు పెట్టేవారిని స్వచ్ఛంద సంస్థలు వెలివేయాలి అమ్మాయిలను చంపినట్లు తెలిస్తే ఎలాగయినా సాక్ష్యాధారాలు చెప్పించి వారికి శిక్షలు పడేందుకు విశ్వ ప్రయత్నం చెయ్యాలి. మహిళా కోర్టుల ద్వారా, ఉమెన్స్ ప్రొటెక్షన్ సెల్స్ ద్వారా కేసుల విషయంలో తగు శ్రద్ధ వహించాలి. కనీసం ఏ కొద్ది మందికైనా శిక్షలు పడితే మిగిలినవారు భయభ్రాంతులవుతారు. తల్లిదండ్రులు బాధపోయినా కేసు మాత్రం పట్టు విడువరాదు. మహిళా సంఘాలవారు అత్యాచారాల నిర్మూలనకు స్త్రీలకు

ప్రత్యేక తరగతులు నిర్వహించాలి. తల్లులకు కొంత విషయ సేకరణను అందివ్వాలి. కూతుర్ని, కొడుకుని ఒకేలా పెంచమని సలహా చెప్పాలి. అమ్మాయిలకు అబ్బాయిలతో పాటు (కట్నానికై వుంచిన డబ్బుతో) వృత్తి విద్యలను నేర్పించమని నచ్చజెప్పాలి. చిన్నప్పటి నుండి ఆడపిల్లలకు ధైర్యం, పట్టుదల నేర్పించాలి. యువజన సంఘాలకు కట్నం పుచ్చుకోవద్దని ప్రతిజ్ఞలు చేయించాలి.

పీడిత భార్యల రక్షిత గృహాలు నెలకొల్పి అక్కడ అధికారితో పాటు ఒక కార్యకర్త ఫోను పెట్టుకొని రోజంతా వంతుల వారీ వుండి బాధితులెప్పుడొస్తే అప్పుడు వారికి రక్షణ కల్పించాలి. వివాహబంధం తుంటుపడిందనే నిర్ణయానికివస్తే వెంటనే విడదీసి ఆమెకు భర్తద్వారా ఆర్థికంగా కొంత సాయపడాలి.

మానభంగాల విషయంలో మహిళా సంస్థలు తగు చర్యలు తీసుకొని శిక్షలు వేయించాలి. ఘాత జరిగిన మహిళకు ఆమెను షాక్" నుండి తెప్పరిల్లేలా చేసి పెళ్ళాడేందుకు తోడ్పడాలి. అలా భార్యలపై హింసకు లైంగిక వేధింపుకు, అశ్లీల సాహిత్య ప్రచారాన్ని ఇతరత్రా అన్నిసమస్యలను సమ్యక్ దృష్టితో చూచి స్వచ్ఛంద సంస్థలు వారిని ఆదుకోవాలి. ముఖ్యంగా వాడవాడలా కరాటే కోర్సులను నడిపించాలి. ఇలా సర్వతో ముఖ్యంగా, ఒకమిషనరీ జీల్ తో మహిళలు, మహిళా సంఘాలు సహాయ, సహకారాలందించే

పురుషుల సాయంతో ముందుకు పయనించాలి. కేవలం చట్టాల వల్ల కానిపని ప్రజలు, ప్రజా సంఘాలు నెరవేర్చగలవని నిరూపిస్తూ ఈఅత్యాచార ఘట్టాలకు మహిళలే స్వస్తి చెప్పాలి. దానికి సర్వతోముఖ కృషి చాలా అవసరం. గ్రామాల్లో అనేకమంది స్త్రీలను ఇంటాబైటా రకరకాలైన చిత్రహింసలకు గురిచేయటం పరిపాటే. అవిద్యా అజ్ఞానాల వల్ల, అంత దండల లేమివల్ల, ఆడదాన్నిగదా అనే చులకనవల్ల ఈ మూగజీవాలు ఇంతకాలం ఇలా పడివుండటం పరిపాటి అయింది. ఇది మహిళా దశాబ్దపు చివరిదశ. ఇప్పుడు స్త్రీలలో జాగృతి, చైతన్యం కలుగుతోంది. మేమెందుకు చదువుకోకూడదు. మేమెందుకు రాజ్యాధికారంలోకి రాకూడదు. మేమెందులో తక్కువ అనే భావాలు వారిని మేలుకొలుపుతున్నాయి. అందువల్ల ఇటు అరాజకంలో ఇమడ లేకపోతున్నారు, అటు బైటపడి పోరాడలేకపోతున్నారు. నేటి స్త్రీల పరిస్థితి వొడ్డున పడ్డ చేపలా కొట్టుమిట్టాడే పరిస్థితిలో పడింది. మరి ఈ పరిస్థితిలో ఏం చెయ్యాలి అనేదొక మౌలికమైన ప్రశ్న, పాత భావాలను విడిచి పెట్టటం ఎంత కష్టమో ఆధునికతను ప్రవేశపెట్టటం అంతకన్నా కష్టం. అయినా ఎప్పుడో అప్పుడు ఎక్కడో అక్కడ నూతనత్వాన్ని ప్రవేశపెట్టక తప్పదు. మార్పు అనివార్యం కదా! మరి వెంటనే ప్రారంభిద్దామా। దానికి తగినంత ధైర్యం, సాహసం, ఓర్పు, నేర్పు అన్ని మనం ముందుగా అలవరచుకొని ఆ రంగంలోకి దిగి విజయాన్ని సాధించాలి.

ఇది కేవలం పురుషుల మీద ధ్వజమెత్తడం కానేకాదు. సమానత్వాన్ని సాధించడం మాత్రమే. మా హక్కులను మేము అనుభవించడం మాత్రమే. ఇంతకాలం అణిగి మణిగి వున్నామనే ప్రతీకార వాంఛ మాకులేదు. కాని దౌర్జన్యాన్ని, హింసను తట్టుకునే శక్తి, ఓర్పు మాత్రంసన్నగిల్లిపోయాయి. తప్పో, వప్పో జరిగిపోయిన దానికి వగచి ప్రయోజనం లేదు. కావాల్సింది మార్పు. రావాల్సింది స్త్రీలతో ఐక్యత. ఎక్కడ ఏ స్త్రీకి ఘాత జరిగినా ఇకముందు స్త్రీ జాతి సహించలేదు. ఏ స్త్రీని బలిగొన్నా, ఏ అమాయకురాల్ని జీవచ్ఛవాన్ని చేసినా, ఏ అబలను హింసించినా ఎదుర్కొనే చొరవా, ఆసక్తి, ఆవేదనా వచ్చాయి స్త్రీ లోకానికి. డార్విన్ చెప్పినట్లు త్రొక్కిపెట్టిన ఏ ప్రాణి అయినా తలెత్తక మానదు.

కనుక ఇకముందు ఇలాంటి అఘాయిత్యాలను ఎదుర్కొనేందుకు స్త్రీలే ముందుకురావాలి. స్త్రీలే పాత్రధారులూ, సూత్రధారులూ కాక తప్పదు. ఆనాడు ఏ స్త్రీని తాకటానికయినా, బట్టలూడదీయటానికయినా ఎంతటి క్రూరుడైనా ముందుకు రాలేడు. మనం సహిస్తుంటే దౌర్జన్యం మనమీద నాట్యం చేస్తుంది. మనమే తిరగబడితే అదుపులోకి వస్తుంది.

మన సహకారం లేనిదే ఈ పురుషలోకం ఈ రాజ్యం ఏలుతుందా? కనుక మనలో వున్న మానసిక దాస్యం పటాపంచలు కావాలి, స్త్రీలంతా సంఘటితంగా పోరాడాలి.అనాడే స్త్రీ జాతికి విముక్తి సిద్ధిస్తుంది.

ప్రిన్సిపాల్ గారు చెప్పిన పరిష్కారమార్గాలు విన్న తర్వాత అరుంధతికి వచ్చిన అనుమానాలు, సందేహాలు అన్నీ తీరినట్లుగా అనిపించాయి. కానీ ఆమె చెప్పినవిధంగా స్త్రీల సమస్యలపై పోరాడటానికి, వారిపై జరిగే అత్యాచారాలు ప్రతిఘటించడానికి వ్యక్తిగతంగా కన్నా సంఘటితంగా అయితే సులభంగా సాధ్యపడుతుందని, అందుకొరకు ఒక సంఘం స్థాపించుకోవటం ముఖ్యమని అర్థం చేసుకున్నది. ఆ విషయాన్ని మేనత్త సత్తెమ్మతో ప్రస్తావించింది. అత్తా ! ఈ మూడు రోజులుగా ఇక్కడ జరిగిన చర్చలువిన్న తర్వాత మన ఆడవారిపై జరుగుతున్న అఘాయిత్యాలను ఎదిరించి పోరాడటానికి మన ఊరిలో ఒక సంఘం స్థాపించుకుందామని వుంది. నీ అభిప్రాయమేమిటి?"అని అడిగింది.

అది విన్న సత్తెమ్మ ఎంతో సంతోషించి"నీకు అంత మంచి ఆలోచన వచ్చి ఆచరణలో పెడతానంటే నాకు అంత కన్నా కావలసింది ఏముంటుంది. వెంటనే ఆ పని ఆచరణలో పెట్టటం మంచిది. అందుకు నన్ను ఏమి చేయమంటే అది చేస్తాను" అని చెప్పింది.

"అయితే అత్తా మరి మహిళా సంఘాన్ని స్థాపించి నడపడానికి నాకు తగినంత వయస్సు, అనుభవం, ఆర్థిక స్తోమతా లేవు కాబట్టి మన ఊరిలో నీలాంటి వాళ్ళు కొంత మందిని చేర్చి ఆ సంఘాన్ని స్థాపిస్తే బాగుంటుందని నాకు అనిపిస్తున్నది" అన్నది అరుంధతి.

"అన్నట్లు మన ఊరిలో ఇంతకుముందే ఒక మహిళా సంఘం నడుస్తున్నది కదా. మళ్ళీ కొత్తది పెట్టటం ఎందుకు" అని గుర్తు చేసింది సత్తెమ్మ.

"నీవు చెప్పినట్లు మహిళాసంఘం అయితే వున్నది కానీ, ఆ సంఘం మనం అనుకున్న విధంగా స్త్రీల సమస్యలపై, అఘాయిత్యాలపై సరిఅయిన విధముగా ప్రతిఘటించలేకపోతున్నది. ఈ సంఘం ఎంతసేపూ ఆడవారికి ఆర్థికంగా ఉపయోగపడే శిక్షణా కార్యక్రమాలు అంటే కుట్లు, అల్లికలు, అప్పడాలు చేయటం మొదలయినవి నేర్పటం లాంటి కార్యక్రమాలతో ఒకపరిధిలో మాత్రమే పనిచేస్తున్నది. కానీ ఆ విధమయిన కార్యక్రమాలవల్ల మనం అనుకున్న పని సాధించలేము. అందుకనేఇంకావిస్తృతపరిధిలో కొత్తపంథాలో కార్యక్రమాలు నిర్వహించే సంస్థను స్థాపించాలి"అనిఅన్నది. అక్కడి మహిళలందరూ బలపరిచారు. అనుకున్న విధంగా "మహిళాసంరక్షణ సంస్థ" ని స్థాపించారు.

ఆ తరువాత ఆ గ్రామంలో స్త్రీలపై ఏ అఘాయిత్యం జరిగినా, అత్యాచారం జరిగినా మహిళా సంరక్షణ సంస్థ హాజరయి విచారించి, రిపోర్టులు ఇవ్వటం, మానభంగం జరిగితే ఆ దుష్టుడ్ని బయటకులాగి తిట్టి సాంఘిక బహిష్కారం జరపటం, అత్తలు హింసిస్తే వారిని దుమ్మెత్తిపోయటం, కట్నం కోసం చంపినా, బాధించినా వారిపై కేసులు పెట్టటం ఆఖరికి ఏ భర్త అయినా తాగి భార్యను కొడితే, ఈ సంస్థ స్త్రీలు వెళ్ళి అతన్ని తిట్టి బుద్ధి చెప్పటమో లేక ఆ బాధితురాల్ని తెచ్చి అలాంటివారిని వేరే ఒక హోమ్‌లోవుంచి వారికి తాము అండగా నిలబడటంలాంటి కార్యక్రమాలు పట్టుదలతో నిర్వహిస్తున్నారు. దీనికంతటికీ మూలం అరుంధతి పట్టుదలేకాక ఆమె వ్యక్తిత్వాన్ని అలా సరిదిద్దిన అత్త, తండ్రులలోపాటు ఆ సెమినారు నిర్వాహకులు కూడాను.





# శిక్షణా కేంద్ర సాహిత్యం

| | | |
|---|---|---|
| 1. | స్త్రీలకు ప్రత్యేక సమస్యలు వున్నాయా? | 2–00 |
| 2. | మానవ హక్కులు; మహిళల హక్కులు | 2–00 |
| 3. | స్త్రీల హోదా ; వివక్ష | 2–00 |
| 4. | వరకట్న మరణాలు : నిషేధ శాసనాలు | 2–00 |
| 5. | స్త్రీలపై అత్యాచారాలు | 3–00 |
| 6. | మతం ; మూఢ విశ్వాసాలు | 3–00 |
| 7. | మత సమాజాలు ; మహిళలు | 1–00 |
| 8. | మత ధర్మశాసనాలు ; మహిళలు | 3–00 |
| 9. | కుల సంకెళ్ళు | 2–00 |
| 10. | వివాహ వ్యవస్థ | 2–00 |
| 11. | ఆడది : వంటపని, ఇంటిచాకిరి | 2–00 |
| 12. | ఇల్లాలి ఇంటిపేరు ఎందుకు మారాలి? | 2–00 |
| 13. | ప్రేమ వివాహాలు సఫలత చెందాలంటే | 3–00 |
| 14. | సామాజిక పరిణామం | 1–50 |
| 15. | జాతీయ సమైక్యత | 1–50 |
| 16. | హేతువాదం | 3–00 |
| 17. | హ్యూమనిజం : స్త్రీ విమోచన | 2–00 |
| 18. | స్త్రీ విముక్తి నూతన సిద్ధాంతం | 2–00 |
| 19. | కామన్ సివిల్ కోడ్ : స్త్రీలు | 2–00 |
| 20. | సెక్సు అపోహలు | 2–00 |
| 21. | సాహిత్యంలో స్త్రీ పాత్ర చిత్రణ | 2–00 |
| 22. | మహిళా దశాబ్దం ; సాధించిన విజయాలు | 2–00 |
| 23. | ప్రపంచ స్త్రీల స్థితిగతులు : పోరాటాలు | 2–00 |
| 24. | మహిళోద్యమ చరిత్ర ; అభివృద్ధి | 2–00 |
| 25. | మహిళాభ్యుదనికి మహిళా పత్రికలు | 2–00 |
| 26. | వివాహం ; దాంపత్య జీవితం | 2–00 |
| 27. | ప్రజాస్వామ్య వ్యవస్థ : స్త్రీలు | 2–00 |
| 28. | మాతృత్వం ; శిశుపోషణ ; కుటుంబ నియంత్రణ | 2–00 |
| 29. | ప్రజోద్యమాలు ; మహిళోద్యమాలు | 2–00 |
| 30. | ఫెమినిజం అవసరమా? | 2–00 |
| 31. | లైంగిక విప్లవం | 3–00 |
| 32. | స్త్రీ స్వేచ్ఛ : యుటోపియా | 2–00 |

# మల్లాది సుబ్బమ్మ సాహిత్యం

1. ఆం. ప్ర. మహిళోద్యమం (1860–[illegible]) (చరిత్ర) రూ. [illegible]–00
2. హైందవం : స్త్రీలు (విమర్శనాత్మక 3[illegible]–00
3. ఇస్లాం : స్త్రీలు గ్రంథాలు) 1[illegible]–00
4. క్రైస్తవం: స్త్రీలు 12-00
5. సమస్యలు, సంస్కరణలు (వ్యాస సంపుటాలు) 25–00
6. మహిళా దశాబ్దం 7–50
7. స్త్రీ విమోచన 7–50
8. ఓ మహిళా ; ముందుకు సాగిపో 7–50
9. వనితాలోకం 12–00
10. మనం; మన సంస్కృతి 12–00
11. [illegible] [illegible]0–00
12. [illegible] 7–00
13. స్త్రీల హక్కులు: సమస్యలు 6–00
14. మత ధర్మశాసనాలు; మహిళలు 8–00
15. బంగారు సంకెళ్ళు 10–00
16. హేతువాదం; స్త్రీలు 5–00
17. లైంగిక విప్లవం 4–00
18. వివాహం; నేడు, రేపు (సంకలనాలు) 20–00
19. మహిళా వికాసం: శ్రమ, ఉద్యోగం 15–00
20. వివాహం సంతానం కోసమేనా? 10–00
21. వరకట్న విశ్లేషణ 10–00
22. స్త్రీల లైంగికత : లైంగిక స్వేచ్ఛ 20–00
23. అశ్లీలం; అసభ్యత 15–00
24. వంశాంకురం (నవలలు) 20–00
25. ప్రేమ+సెక్స్=నీతి 17–00
26. వెలిగిన జ్యోతి 12–00
27. కాంతి కిరణాలు 12–00
28. చీకటి వెలుగులు 10–00
29. ఈ దేశం నాదేనా? 5–00
30. మాతృత్వానికి మరో ముడి 20–00
31. స్త్రీ విముక్తి 6–00